# వేణీ సంహారం



శ్రీ యం. సంగమేశం, యం. ఏ.,




ఉమా పబ్లిషర్సు
విజయవాడ-1

# శిశుపాల వధ

అవి ద్వారకా నగరంలో తీరుబడి రోజులు. శ్రీకృష్ణుడు తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులను సేవిస్తూ, బంధుమిత్రులతో కలిసి సుఖోప భోగ యథేచ్ఛా విహారా లనుభవిస్తూ కాలం గడుపుతూన్న సమయం. అదే నారదుల వారికి సరిపడని విషయం. సరాసరి ఆ మహాముని ద్వారకా నగరానికి పయనించాడు. ఆకాశ మార్గాన్న దిగి వస్తూన్న ఆ మహాత్ముని దివ్య తేజస్సు చూసి ప్రజలేకాదు శ్రీకృష్ణుడు కూడ విస్మయ పడ్డాడు. మొదట అదేదో కాంతిపుంజ మనిపించి, అంతలోనే అంచులు దిద్ది, ఆకృతి నిరూపించి నట్లుయి, మరికొంత సేపటికి పురుషాకృతి అని స్పష్టపడి ఇంకా దగ్గరగా వచ్చేసరికి 'మన నారదులవారే' అని తెలిసే వరకు ప్రజల ఆనందానికి మేర లేక పోయింది. శ్రీకృష్ణుడు వచ్చిన మునికి ఎదురేగి స్వాగత సత్కారా లిచ్చి, తన రాచనగరులో విడిదియించి, ఇష్ట బంధువులతో కలిసి యథావిధిగా ఆతిథ్య సేవలన్నీ నెరవేర్చాడు.

శరచ్చంద్రచంద్రికా ధవళమైన నారదులవారి తేజస్సు, ఆయన దివ్య సుందరమైన రూపానికి ఎంతైనా అనుగుణంగా ఉంది. ఆ సౌందర్యం లోకపావన మైనది. ఆతని చేతిలోగల 'మహతి' శ్రీకృష్ణుని పావన గుణాలను కీర్తించడంలో తనకు

తనే సాటి అనిపించుకొంటూంది. కుశల ప్రశ్నాదులన్నీ ముగిసి బంధు మిత్రులు, ప్రజలు మునీశ్వరుని దర్శించి ధన్యులై తమతమ నివాసాలకి మళ్ళిన పిదప ఏకాంతం లభించగానే శ్రీకృష్ణుడు నారదుని యీ రాకకు గల విశేష ప్రయోజన మేదో తెలుసుకో గోరాడు. "సకల జన హృదయాంతర్వర్తివై, సర్వ వ్యాపకుడవైన నీకు తెలియని విషయ మేమున్నది కృష్ణా" అని నారదుడు తన రాకకు గల ముఖ్య కారణాన్ని యీ విధంగా వినిపించేడు.

"పూర్వం దితి గర్భాన హిరణ్యకశిపుడు జన్మించి ఈ రేడు లోకాలను తహతహ లాడించాడు. అప్పుడు నీవే నృసింహరూపం ధరించి ఆ రాక్షసుని హతమార్చి లోకాలన్నిటినీ కాపాడేవు. వాడే మరుజన్మలో రావణుడై పుట్టి రెట్టింపు పగతో మూడు లోకాలనూ ముట్టడించి గెల్చి, ఎదురులేని అహంకారం, తిరుగులేని గర్వం ఎవరికీ లేని వరబలం కల్గి, నీ భార్య అయిన సీతామ తల్లినే అపహరించాడు. నీ దయవల్ల లోకాలన్నీ వాని బాధలనుండి విముక్తి పొందాయి. ఇప్పుడు తిరిగి ఆ రాక్షసు డీ నాడు సన్నిహిత బంధువుగా, శిశుపాలుడనే పేర, నాల్గు చేతులు మూడు కళ్ళూ పుచ్చుకొని పుట్టాడు. నీ కృపచేత వాని కధికంగా లభించిన యీ అవయవాలు నశించాయి. ఇప్పుడు నశించ వలసింది వాని విగ్రహమే. మహాత్మా! నీవు ద్వారకలో తీరుబడిగా విలాస విహారాదు లనుభవిస్తున్నావు. అటు చూస్తే

లోకమంతా శిశుపాలుని క్రూరత్వానికి పాల్పడి అల్లకల్లోల మవుతూంది. లోక కంటకుడైన యీ దుర్మార్గుని సంహరించి లోకాల నుద్ధరించవలసిందని ప్రార్థించడానికే నేను పనిగట్టు కొని వచ్చాను. ''

నారదుని మాటలు శాంతంగా విని, సస్మిత వదనుడై శ్రీకృష్ణుడు 'తమ ఆజ్ఞ, యథా శీఘ్రంగా నిర్వహిస్తా' నని చెప్పి, యథోచిత సత్కారాలాచరించి ఆయనను సాగ నంపాడు. శ్రీకృష్ణుడు మాట యిచ్చినదే చాలు పని జరిగినంతగా సంతసించి నారదుడు దేవలోకానికి వెళ్ళి పోయాడు.

ఏవిధంగా శిశుపాలుణ్ణి సంహరించ గలుగుతానని శ్రీకృష్ణుడు తదేక చిత్తుడై ఆలోచిస్తున్నాడు. ఎదురెత్తి యుద్ధానికి పోతే శిశుపాలునితో పాటు ఇంకెందరినో చంప వలసి వస్తుంది. ఏదో దుర్మార్గుడైన వాని నొకణ్ణి చంపి లోకానికి వానివల్ల జరిగే బాధలు తొలగించడం మంచిది గాని ఆ ఒక్కని కోసం మరో వెయ్యి మందిని చంపితే లోకాని కేమి సుఖం?

శ్రీకృష్ణుని కెంతగా ఆలోచించినా సుఖమైన మార్గం బోధపడలేదు. కాని ఇంతలో పాండవులలో పెద్దవాడు ధర్మ మార్గానువర్తి అయిన యుధిష్ఠిర మహారాజు రాజసూయ యాగం చేయడానికి నిశ్చయించినట్లు వర్తమానం వచ్చింది. శ్రీకృష్ణుడు పాండవులకి బంధువు, బావమరది, పరమాప్త

డైన స్నేహితుడు. అతడు లేనిదే యాగ మేమిటి? యజ్ఞ పురుషుడే శ్రీకృష్ణుడు. బంధుమిత్ర సపరివారంగా ఇంద్ర ప్రస్థ పురానికి దయచేయ వలసిందనే ఆహ్వానం చేతిలో పడినదే తడువుగా శ్రీకృష్ణుడు మరింతగా కింక ర్తవ్య విచారుడయ్యాడు. మిత్రుల యింటికి పోయి విందు లార గించడమా? శత్రుడైన శిశుపాలుని మీదికి యుద్ధానికి పోవడమా? ఎంత ఆలోచించినా నిర్ణయం కుదర లేదు. చివ రకు బలరామ సాత్యకులనూ, ఉద్ధవుణ్ణి పిలిచి తనకున్న సంశయాన్ని, సందేహాన్ని వాళ్ళతో చెప్పి ఇలా అన్నాడు. ''యుధిష్ఠిరుని తమ్ములు భీమార్జునులు మహా శక్తి సంప న్నులు. దిక్కులన్ని జయించి రాగల ధీరవీరులు. మనం లేక పోయినా వారి స్వభుజా శక్తి మీద ఆధారపడి వారీ రాజ సూయ యాగాన్ని నిర్విఘ్నంగా కొనసాగించ గలరు. మనకి శత్రువు పక్కలో బల్లెమువలె ఉన్నాడు. వీణ్ణి ఉపేక్షించడం కూడ మనకి తగదు. పెరుగుతూన్న రోగాన్ని బలుస్తూన్న శత్రువుని యథా శీఘ్రంగా నిరోధించి నిర్మూలించాలని పెద్దలు చెప్తారు. శిశుపాలుడు నాకు శత్రువని నేనింతగా చెప్ప లేదు. వాడు లోకానికే శత్రువు. మనకోసం కాదు, లోక శ్రేయంకోసమైనా వాణ్ణి వెంటనే హతమార్చ వలసి వదని నా అభిప్రాయం. మీ రేమంటారు?'' అని చెప్పిన శ్రీకృష్ణుని మాటలు బలరామునిలో కోపాన్ని రగుల్కొ ల్పాయి. శిశుపాలుడు మొదటినుండి యింతవరకు వారికి

చేసిన అపకారాలన్నీ ఒకటొకటిగా జ్ఞాపకమొచ్చి అతని కోపం అంతకంతకీ ఎక్కువయింది. కన్ను లెర్ర బారాయి. ముఖంలో కోపం మూర్తి కట్టింది. పెదిమలు కంపించాయి. పళ్ళు కొరుకుతూ "ఆ దుర్మార్గుడైన శిశుపాలుణ్ణి తక్షణమే సంహారించడం మంచిదని నా తాత్పర్యం. అదిగాక, శత్రు శేషం, ఋణశేషం చిరకాలముంటే ముప్పుకే హేతువులు. ఈ శిశుపాలుడు చేసిన దుర్నయాలిన్నీ అన్నీ కావు. నయాన్నా భయాన్నా కూడ వాడు మనకి లొంగడు. తాను చేసే దుశ్చేష్టలు మానడు. రాజీకి రాడు. సంధి కొప్పుకోడు. అందువల్ల నా మత మనుసరిస్తే, ఇంద్రప్రస్థం వెళ్ళడానికి బదులు శిశుపాలునితో యుద్ధానికి ప్రస్థాన భేరీ వేయించడం మంచిది" అన్నాడు. కోపావేశంతో మండి పడుతూన్న అన్నగారి మాటలు శ్రీకృష్ణుని కెంతో నచ్చాయి. నీవే మంటావన్నట్లు ఉద్ధవునివైపు చూచాడు. ఉద్ధవుడు చాలా బుద్ధిమంతుడు. సహజ శాంతుడు. లౌకిక మెరిగినవాడు. నీతి తెలిసినవాడు కాబట్టి యుక్తాయుక్తాలు విచారించి ఇలా చెప్పాడు.

"మీరు శిశుపాలుణ్ణి బలహీనుడనికాని, నిస్సహాయు డనికాని తలుస్తున్నారేమో, అది చాలా పొరబాటు. వాడంత సులువుగా జయింపబడేవాడు కాడు. అతడి పక్షమై నిల్చి చావమన్నాసరే తయ్యారని వస్తారు బాణాసురుడు, కాలనేమి, సాళ్వుడు రుక్మి మొదలైన వాళ్లో వందమంది.

వారివారి సైన్యాలన్నీ కలిసి యుద్ధానికి వస్తే అది సామాన్య సంగ్రామం కాదు, దేవదానవ మహాయుద్ధ మంతటి పెద్ద సంగ్రామ మొకటి సంభవిస్తుంది. వేర్వేరుగా వీరంతా మీకంటే తక్కువ వాళ్లే. అయితే నేమి చిన్న నదులన్నీ కలసి ఒక పెద్ద మహానదిగా మారి ప్రవహించినట్లు వీరంతా కలసి మిమ్మెదిరించడానికి తగిన శక్తివంతు లవుతారు. వాళ్ళ స్నేహితులే కాదు, మీ పగ వాళ్ళందరూ వాళ్ళ పక్షమే వెళ్లి నిలుస్తారు. మరొక విషయం. వీరంతా కలిసి పాండవుల రాజసూయానికే విఘ్నం తెచ్చిపెట్ట గలరు. యజ్ఞ విఘాతానికి కారకులని పాండవులు మిమ్మల్ని నిందించ వచ్చు. శత్రువుల మాటకేమి? మిత్రుల మనస్సు కలత పెట్టడం మనకి ధర్మమా? ఈ యజ్ఞ భారాన్ని మనమీద వేసి సుఖించాలని ఆసించిన పాండవుల కిది ఆశా విరుద్ధమైన ఫలితా లిచ్చే ప్రయత్న మవుతుంది. అదికాక శిశుపాలుడు మీ మేనత్త కొడుకు. వాడు చేసే నూరు తప్పులు క్షమించ మని మీ మేనత్త నిన్ను కోరింది. నీ వామె కట్టి వాగ్దానం కూడ చేసేవు. లెక్కిస్తే వాడు చేసిన తప్పు లింకా నూరు కాలేదు. కాబట్టి ఇప్పట్లో యుద్ధ ప్రయత్నం మాని పాండవుల రాజసూయానికి సహాయ పడడం సరియైన పని. ఈలోపుగా గుప్తచరుల వల్ల శత్రువుల ఆనుపానులు, బలాబలాలు ఆకట్టి తెలుసుకోవడం మంచిది. ఆమీద యుద్ధం వస్తే శత్రువుల్ని జయించడం కూడ సుసాధ్యమే.” అని

చెప్పి ఊరుకొన్నాడు ఉద్ధవుడు. బలరామ కృష్ణు లిద్దరికీ యీ మాటలలో గల నీతి విశదమైంది. అదే సలహా పాటించడానికి నిశ్చయించి ఇంద్రప్రస్థానికని ప్రయాణ సన్నాహాలు చేయసాగేరు.

ఒక శుభముహూర్తం నిశ్చయించి శ్రీకృష్ణుడు సపరివారంగా ఇంద్రప్రస్థానికి బయల్దేరాడు. తనకని పూన్చి తెచ్చిన నాలుగు గుర్రాల బంగారు రథం మీద కూర్చొన్నాడు. నవరత్న ఖచితమైన ఆ రథానికి శిబిరం మీద శోభాయమానంగా గరుడ ధ్వజం కట్టబడింది. శ్రీకృష్ణుడు హార కేయూర కటక మేఖలా కాంచీమణి నూపురాద్యలంకారాలు ధరించి, రత్న కిరీట శోభితుడై, శంఖ చక్ర గదా శార్ఙ్గములనే ఆయుధాలు సవరించుకొని రథ మలంకరించి నప్పటి ఆ శోభ చూపరుల కెంతైనా ఆనందాన్ని కలిగించింది. ఇంద్రనీల మాణిక్యంవంటి నల్లటి కాంతితో ఒప్పే ఆయన శరీరం, పైనున్న పచ్చని పట్టుబట్టలతో, పరాగ ధూసరితమైన యమునా నదీ ప్రవాహ కాంతుల్ని జ్ఞాపకానికి తెస్తూంది. పాంచ జన్యపు మ్రోతకు తోడు పంచ మహా వాద్యాల శబ్దం భూన భోంతరాలు నిండి మారు మ్రోగుతూంది. శ్రీకృష్ణుని రథాన్ని ఆనుకొని బలరామ సాత్యకాదుల రథాలు కదిలాయి. యదువృష్ణి భోజాంధక కులాలన్నీ ప్రయాణించాయి. అంతఃపురస్త్రీల శిబికలా వెనుకనే నడువసాగాయి. చతురంగ బలాలన్నీ బారులుతీరి

నడుస్తూంటే అదేదో సేనావాహిని ముందుకు ప్రవహిస్తూ న్నట్లు రూపించింది. ద్వారకా వాసులందరికీ అదొక ఉత్సవ మనిపించింది. ఊరంతా ఉత్సాహ భరితమయి నిల్చి చూసి ఆనందించింది. తన పట్టణపు శోభ తానే చూసి ఆనందిస్తూ శ్రీకృష్ణుడు నగర సింహద్వారం దాటాడు. నగరం దాటి సముద్ర తీరాన్నంటి ప్రయాణం చేస్తూన్నప్పుడు చల్లటి సముద్రపు గాలులు, చిన్న చిన్న నీటి తుంపరలు, కెరటాలు విరిగేటప్పటి శ్రుతి మధురమైన శబ్దాలు అప్పటి కప్పుడు రూపు కట్టి మళ్ళీ అంతలోనే విరిసి తెల్లబారిపోయే మేఘ పంక్తులు వగైరాలు ప్రయాణికుల కెంతైనా ఆనందాన్ని కలిగించాయి. ప్రయాణపు శ్రమ ఏమాత్రమూ అనుభవించ కుండా వారందరూ కచ్ఛ ప్రదేశం చేరుకొన్నారు. అచ్చటి కొబ్బరి తోటల్లోనూ, పోక తోపుల్లోనూ విహరిస్తూ, లవంగ పుష్పాల తీగలు మాలలుగా కట్టి ధరిస్తూ, రకరకాల ఫలా లాహారిస్తూ ముందుకు సాగి రైవతక పర్వతాన్ని సమీపించారు.

రైవతక పర్వతం నానారత్న శోభితమైన సానువుల తోనూ, చిత్ర విచిత్రమైన గుహలతోనూ, అత్యంత రమ ణీయ మైన దృశ్యాల్ని సమకూర్చింది. ఆ కొండ శిఖరాన్ని ఆవరించి వెల్ల గొడుగు పట్టినట్లు నిల్చాయి మేఘాలు. ఆ నీడలో అత్యుత్సాహంతో నటిస్తున్నాయి నెమళ్లు. రంగు రంగుల పక్షులు వస్తూన్న శ్రీకృష్ణుని ఆహ్వానిస్తూ జయ గీతు లాలపించాయి, పూచి వికసించిన పుష్పాలు పహా

రంగా పట్టి నిల్చినట్లున్నాయి వృక్ష జాతులు. తమ సువాసనతోనే తమవైపు ఆకర్షించి పిలుస్తున్నట్లున్నాయి ఫల వృక్షాలు. ఎక్కడ చూసినా మధురమైన పళ్ళు, ఏవైపు వెళ్ళినా నిర్మలమైన నీరుతో ప్రవహించే సెలయేళ్ళు, ఏప్రక్కకి పోయినా చూపుకి సొంపు గూర్చే తామర కొలనులు, ఎక్కడవిన్నా తుమ్మెదల రొదలు, పక్షుల పలుకులు, లేళ్ళ పరుగులు, కుందేళ్ళ గంతులు ఇదంతా చూసి శ్రీకృష్ణుడు ముగ్ధుడయ్యాడు. అతని మనస్సు కనిపెట్టి సారథి అయిన దారుకుడతనితో ఇలా అన్నాడు.

మహాత్మా! ఈ పర్వత శిఖరాలాకసాన్ని అంటుతున్నాయి. వాటిమీద సూర్య చంద్రుల కిరణాలు నేరుగా ప్రసరిస్తాయి. అక్కడ మేఘాలు వర్షిస్తాయి. ఆ నీరు సెలయేళ్లై క్రిందికి ప్రవహిస్తూంది. ఎక్కడ చూసినా పచ్చిక బయళ్ళు అందులో మేసి తిరుగుతూన్న లేళ్లు, సరోవరాలలో విహరించే ఏనుగులు ఒడ్డున పూచి విలసిల్లిన కదంబ వృక్షాలు, వాటిక్రింద సిద్ధసాధ్య గంధర్వాదుల నృత్యగానాలు వారినృత్యగానాల కనుగుణంగా ఈ సెలయేటి కెరటాల తాళ వాద్యాలు నెరపుతాయి. పొదరిళ్లలో విహరించే గాలి వారి పాటకి శ్రుతి కూరుస్తుంది. ఈ సరోవరాలకి ఇంద్రనీల మాణిక్యపు చీకట్లు, మెట్లు కూర్చబడ్డాయి. స్వచ్ఛమైన ఆ నీటిమీద సూర్య కిరణాలు పడి ఒడ్డున విరిగే కెరటాల తుంపరలచేత ఎన్నెన్నో ఇంద్ర ధనుస్సుల్ని నిర్మిస్తున్నాయి. ఇది సమ

శీతోష్ణమైన రమ్యప్రదేశం. ఇక్కడ కొంతకాలం నిల్చి, ఈ పర్వతమిచ్చే ఆతిథ్యాన్ని స్వీకరించ వలసినదని నా ప్రార్థన" అని చెప్పాడు. సారథి మాటలు శ్రీకృష్ణునికి నచ్చాయి. వెంటనే సేనలు నిలిపి విడుదులు వేయించాడు. పెళ్ళివారు తోటలో దిగినంత సందడితో వారంతా ఆ పర్వతాన్ని ఆక్రమించి నిల్చారు. అక్కడుండే జంతువు లెన్నిటినో వేటాడారు. వచ్చిన వారికి కావలసిన సమస్త సదుపాయాలు ఆ పర్వతరాజు సమకూర్చేడు. ఋతువులన్నీ శ్రీకృష్ణుని సేవించడానికి వచ్చాయి. ఒకే సమయంలో ఆ ప్రదేశం ఆరు ఋతువులలోనూ పూచే పువ్వులతోటీ, పండే ఫల జాతులతోటీ నిండిపోయింది. ఈ ప్రక్క వసంత శృంగారముంటే, ఆ ప్రక్క గ్రీష్మపు శోభ. ఇక్కడ వర్ష మేఘాలు, మయూర నృత్యాలు ఉంటే, అక్కడ శరత్కాలపు వెన్నెలలు. ఓవైపు మంచు కురుస్తూఉంటే ఇంకోవైపు ఆకులు రాలుతున్నాయి. ప్రకృతి సౌందర్యమంతా అక్కడే గూడుకట్టుకొన్నట్టయింది. ఈ విచిత్రాలన్నీ చూసి ఆనందిస్తూ శ్రీకృష్ణుడు అతని పరివారము కూడ తాము ప్రయాణం చేస్తున్నామనిగాని, మార్గమధ్యంలో ఉన్నామనిగాని, ఇంకా ముందుకు ప్రయాణించాలనిగాని, ఏమీ ఆలోచించ లేదు. అన్నీ మరిచి అక్కడే కొన్నాళ్ళుండిపోయి సమస్త సౌఖ్యాలు అనుభవిస్తూ కాలం గడిపేరు. తిరిగి బయల్దేరిన నాడు ఎవరికీ సరిగా కాళ్ళు రాలేదు. అయితేనేం, వెళ్ళ

వలనే తోట ఇంకా అందంగానూ ఆకర్షనీయంగానూ కని పించే సరికి క్రొత్త ఉత్సాహంతో ముందుకు సాగారు.

శ్రీకృష్ణుని రథం ముందు కదిలింది. వెనువెంటనే మిగిలినవారి రథాలు బయల్దేరాయి. ఆ వెనక చతురంగ బలాలు నడిచాయి. దారిలో ఎందరెందరో రాజులు వచ్చి శ్రీకృష్ణుని దర్శించి ఆతని అనుజ్ఞ పుచ్చుకొని అదే సేనా వాహినితో కలిసి ఇంద్రప్రస్థానికి నడిచారు. ఈసారి వారి మార్గం సమ ప్రదేశాలంటి నడిచింది. పచ్చిక బయళ్ళు, పంటభూములు, పళ్ళతోటలు, పల్లెటూళ్లు దాటి మహో త్సాహంతో వారంతా ముందుకు నడిచారు. మార్గంలో ఎదురునిల్చి ఎందరెందరో శ్రీకృష్ణుని దర్శన భాగ్యాన్ని వరించారు. ఏవేవో తెచ్చి కానుకలిచ్చారు. ఎందరెందరో స్తోత్రాలుచేసి ధన్యులయారు.

ఇంద్రప్రస్థం సమీపించింది. పాండవుల కీసంగతి తెలి యగానే ఎదురు సన్నాహాలుచేసి వీరిని తోడ్కొని పోవ డానికి బయల్దేరారు. అయిదుగురన్నదమ్ములూ శ్రీకృష్ణుని చూడగానే రథాలు దిగి కాలి నడకనుపోయి ఆయనను కలుసుకోబోయారు. కాని శ్రీకృష్ణుడు వారికంటె ముందు తానే రథం దిగి వెళ్లి ధర్మరాజుకి నమస్కరించాడు. భీముని కౌగలించుకొన్నాడు. అర్జున నకుల సహదేవులు తనకి నమ స్కరిస్తే ఆశీర్వదించి ఎత్తి కౌగలించుకొన్నాడు. అందరి కళ్ళూ ఆనంద బాష్పాలతో చెమ్మగిల్లాయి. పట్టరాని ఆనం

దంతో వళ్ళు గగిబొడిచినట్టయింది. తిరిగి రథారోహణం చేసిన పిదప ధర్మరాజు స్వయంగా శ్రీకృష్ణునికి సారథ్యం నెరపాడు. భీమార్జునులు ఛత్ర చామరాలు పట్టి నిల్చారు. నకుల సహదేవులు అనుచరులై నిల్చారు. శిష్యబృందంతో వస్తూన్న గురువుగారివలె శ్రీకృష్ణుడు పాండవులతో కలిసి ఊళ్ళోకి పయనించాడు. అప్పటికప్పుడే వచ్చిన రాజుల గుడారాలన్నీ త్రోవ కిరుప్రక్కలా ఉన్నాయి. ఊరంతా శ్రీకృష్ణుని స్వాగతానికై అలంకరించబడింది. ప్రజలు శ్రీకృష్ణుని చూడడానికి ఒడ్డు విరిగి వచ్చారు. అంతఃపుర స్త్రీలు మేడలమీద మిద్దెలమీద నిల్చి శ్రీకృష్ణుని దివ్య సుందర విగ్రహాన్ని చూసి తన్మయులయారు. లాజలు పుష్పాలు, అక్షతలు జల్లి దీవించారు. బ్రాహ్మణులు స్వస్తి వాచకం చేస్తూ వెన్నంటి నడిచారు. సువాసినీ స్త్రీలు మంగళహారతు లిచ్చి దీవించారు. మయసభా ప్రాంగణంలో శ్రీకృష్ణుని రథమాగింది. చేయూత యిచ్చి ధర్మరాజు శ్రీకృష్ణుని రథావరోహణం చేయించి సభా మంటపం లోనికి తీసుకొని వెళ్ళాడు.

అదొక దివ్య సభ. దానిని మయుడు ప్రత్యేకంగా పాండవులకని తన శిల్ప చాతుర్యమంతా చూపి నిర్మించాడు. అదంతా బంగారుమయం. రత్నమాణిక్య భరితం. చిత్ర విచిత్ర శిల్ప శోభితం. నీరున్న చోట నీరు లేనట్లు, నీరు లేని చోట నీరున్నట్లు గోడలున్న చోట ద్వారాలున్నట్లు, ద్వారా

లున్న చోట గోడలున్నట్లు కనిపించి క్రొత్తవారి నెంతైనా భ్రమింపజేసి ఆశ్చర్యం గొల్పుతూందా సభ. రాత్రి వెన్నెలలో చూస్తే చంద్రకాంతమణి శిలా నిర్మితమైన ఆ సభ వెన్నెలలో కలిసి వెన్నెలైనట్లు కనిపిస్తుంది. ఆ విచిత్ర సౌధాన్ని చూసి మెచ్చుకొంటూ శ్రీకృష్ణుడు పాండవులతో కలసి ఆస్థాన మంటపం చేరుకొన్నాడు. అక్కడ ఉన్న అత్యున్నతమైన రత్న సింహాసనంమీద ఆయన కూర్చుని ఉంటే పాండవులయిదుగురూ అర్ఘ్యపాద్యాలిచ్చి అతణ్ణి సేవించారు. కొంతసేపు కుశల ప్రశ్నలు, ఇష్ట వార్తా ప్రసంగాలు నెరపి, నృత్యగీతాది వినోదాలతో కొంత ప్రొద్దు గడపి, శ్రీకృష్ణుడు తనకని పాండవులు ప్రత్యేకంగా నియోగించిన దివ్యసౌధంలో విడిసి ఆనాటికి విశ్రాంతి తీసుకొన్నాడు.

మర్నాడు సభా మంటపంలో కొలువుతీరి ఉండగా శ్రీకృష్ణునికి నమస్కరించి ధర్మరాజీ విధంగా తన అభిప్రాయాన్ని తెల్లియజేశాడు. "మహానుభావా! నేనీ రాజసూయ యాగాన్ని తలపెట్టేను. కాని నీ సహాయ్యాన్నగాని అది జరుగదు. అసలు నీవిక్కడ నిలుస్తేనే యీ యాగం. ఈ నా సంపదలన్నీ నీ కరుణ వలన కలిగినవే. నేనూ నా యీ సోదరులు నీ అధీనులం." అని చెప్పాడు. "అవశ్యం చెయ్యవలసినదే" అంటూ శ్రీకృష్ణుడిలా చెప్పాడు. "రాజసూయ యాగం చెయ్యడానికి నీ వన్నివిధాలా యోగ్యుడవు. నా సహాయం నీకెప్పుడు ఏవిధంగా కావాలంటే

ఆవిధంగా లభిస్తుంది. అసలు నేనే నీవాణ్ణి. నన్ను అర్జునుడితో సమంగా భావించి నీ యిష్టమొచ్చిన పనిలో నియోగించు. నీయీ కార్యాన్ని కాదనే దుష్టు లెవరైనా ఉంటే చెప్పు. నా చక్రింతో వాళ్ళ తలలు వేయి చక్కలు చేసి విడుస్తాను. ''

శ్రీకృష్ణుని మాటలు విని ధర్మరాజు బ్రహ్మానంద భరితుడయ్యాడు. యజ్ఞానికి కావలసిన పనులన్ని చురుకుగా సాగ నారంభించేయి. ఒక శుభ ముహూర్తాన యజ్ఞం ప్రారంభింపబడింది. ఋత్విక్కులు వేదమంత్రాలతో దేవతల నాహ్వానించారు. ఉద్గాతల సామగానంతో యజ్ఞశాల ప్రతిధ్వనిస్తూంది. హోమధూమం ఆకసాన్నంటి మేఘాలు క్రమ్ముతూంది. ధర్మరాజు దీక్షితుడయ్యాడు. ద్రౌపతి కుశ మేఖలాలంకృతయై యజ్ఞ సంభారాలన్నీ ఎప్పటికప్పుడు తన పర్యవేక్షణలో యథోచితంగా నడిచేలా చూసుకొంటూంది. ఎక్కడా ఏలోపమూ లేకుండా యాగం జరుగుతూంది. సత్పాత్రులైన బ్రాహ్మణు లెందరో ధర్మరాజు వలన యథాభీష్టంగా దానాలు గ్రహించి అతణ్ణి ఆశీర్వదించి వెళ్తున్నారు. ఎవరూ అసంతృప్తులైనట్లుగాని, నిరాశపడ్డట్లుగాని వినపడదు. వచ్చిన రాజులు తాము పెట్టిన కట్న కానుకలతో యజ్ఞశాల నింపివేశారు భీమార్జునుల బలం, శ్రీకృష్ణుని సహాయం లభించినప్పుడు యజ్ఞానికి విఘ్నమేమిటి? లోటేమిటి? ఎంత దివ్యంగా జరగాలో అంత దివ్యంగా

జరిగి ఆ యజ్ఞం ధర్మరాజు కీర్తిని నలుదిశలా వ్యాపింప జేసింది.

యజ్ఞం పాంతం కాజొచ్చింది. అతిథి పూజ చెయ్య వలసే ఘట్టం సమీపించింది. సదస్సులంతా సభలో వచ్చి కూర్చొన్నారు. 'తాతా! వీరందరిలోనూ ఎవరు ముందు పూజార్హులో నాకు చెప్పవలసిన' దని ధర్మరాజు భీష్ముని కోరాడు. 'శ్రీకృష్ణునికంటె పూజార్హు లెవరోయి' అన్నాడు భీష్ముడు. "మిగిలినవా రెక్కడో నిచ్చి యజ్ఞాలు చేసి యజ్ఞపురుషుడైన శ్రీకృష్ణుని పరోక్షవిధిలో అర్చిస్తారు. నీ అదృష్టం వలన శ్రీకృష్ణుడు ప్రత్యక్షంగా వచ్చి నీ యజ్ఞంలో పాల్గొన్నాడు. అతణ్ణి అర్చించి, యజ్ఞాన్ని సఫలం చేసుకొని నీవు తరించి, మమ్మల్ని తరింపజెయ్యి" అని చెప్పాడు భీష్ముడు. ధర్మరాజాతని సలహా పాటించి శ్రీకృష్ణుని యథోచిత సత్కారాలతో పిల్చి తెచ్చి, యోగ్యమైన సింహాసనంపైన కూర్చొబెట్టి, యథావిధిగా అర్ఘ్య పాద్యాదులిచ్చి ఆర్చించాడు.

ఇదంతా చూస్తూన్న శిశుపాలునికి పట్టరానంతగా ఈర్ష్య, అసూయ, కోపం ముంచుకొచ్చాయి. అతడిది తన కవమానంగా భావించాడు. సభలో నిలవడానికే కంటకించు కొన్నాడు. కనుబొమ్మలు ముడివేశాడు. ముఖం జేగురు చేసుకొని లేచి సవాలుచేస్తూ, "ధర్మరాజా, ఇదేనా నీ ధర్మ బుద్ధి" అని గర్జించాడు.

సభ విస్తుపోయింది. అంతటా నిశ్శబ్దమయింది. పూజ నిల్చిపోయింది. అందరి దృష్టులూ హఠాత్తుగా శిశుపాలుని వైపు తిరిగాయి. "నీ బంధువు కదా అని కృష్ణుని గౌరవించావు కాని, గౌరవార్హుడని గౌరవించావా? యుధిష్ఠిరా! ఈ కృష్ణుడు గొల్లవాడు. ఇందరు రాజులుండగా ఇతడా నీకు పూజనీయుడు?" అని అంటూ శిశుపాలుడు భీష్మునిపై కూడ విరుచుకపడ్డాడు. తిరిగి శ్రీకృష్ణునే సవాలు చేసి ముఖాముఖిగా ఎదిరిస్తూ ఇలా అన్నాడు. "ఓహో కృష్ణా! పాండవులకి మతిపోతే నీకెంత సిగ్గు లేకపోయింది? తగుదునమ్మా అని తయారయ్యావే, యీ పూజలందుకోడానికి నీలో అణుమాత్రమైనా యోగ్యత ఉందా? నీకు చూస్తే నా అనేవాళ్ళు లేరు. నాదీ అని చెప్పుకోడానికి తగిన నేల లేదు. నీ కులమేదో నీకే తెలియదు. శౌర్య పరాక్రమాలెటువంటివో జరాసంధాదుల్ని అడిగితే తెలుస్తుంది. నీలో ఏ ఉత్తమ గుణ మున్నదని పొంగిపోయి, వీరు నిన్ను పూజిస్తున్నారో నాకు తెలియదు. నాకు తెలిసినంతవరకు, యీ రాజలోకమంతా ఎరిగినంత మేరకు, నువ్వు దొంగవు కాని దొరవు కావు. జారుడవు కాని శూరుడవు కావు. సత్యభామకు మొగుడైనంత మాత్రాన్న నువ్వు సత్యప్రియుడవా? ఈగలు దోమలు వంటి ఏ అల్పులనో యిద్దరు ముగ్గుర్ని చంపి మురిసిపోయి నిన్ను నీవే వీరుడనుకొంటున్నావేమో! ఏ పరిస్థితిలో నీవు ద్వారకా నగరం పోయి

దాగొన్నావో జ్ఞాపకం తెచ్చుకో." అని ఈసడించి నోటికి వచ్చినట్లెల్లా అతడు కృష్ణుని దూషించాడు. శ్రీకృష్ణుడు లోలోపల యీ నిందావాక్యాలన్నీ లెక్కపెడుతున్నాడు. 'నూరు కానీ, వీని పాపాలు నిండుతాయి' అని అనుకొంటు న్నాడు.

శిశుపాలుడు మరీ గర్వించి, మిగిలిన రాజు లందరినీ ఉత్తేజింప జేయసాగాడు. "సింహాలను తృణీకరించి, నక్కకి పట్టాభిషేకం చేసినట్లు యీ ఉన్న రాజలోకాన్నంతటినీ తిర స్కరించి, యుధిష్ఠిరుడు మంద గొల్లను మహాత్ముడని భావించి పూజించేడు. బోడి బుర్రకి సంపంగినూనె రాసి తల దువ్వినట్లు, గుణహీనుడైన కృష్ణుణ్ణి సద్గుణ గరిష్ఠుడుగా భావించి ఈ భీష్ముడు పూజార్హుడని సెలవిచ్చాడు. ఈ సభలో ఉండడం మీ కందరికీ తలవంపులుగా లేదా? మీ శౌర్య పరాక్రమాభిమాన తేజో గౌరవాల కిది సరియైన సన్మాన మేనా?" అని గర్జించాడు. రాజ లోకంలో ఒక సంచలనం కలిగింది. ఏదో నిద్రలో ఉన్నవాళ్లు కలవరపడి లేచినట్ల యింది. ఎక్కడి వారక్కడే ఆయుధాలు సవరించుకొంటు న్నారు. ఊ అంటే ఒక్క ఉదుటన మీద లేచి యుద్ధానికి దిగేలా ఉన్నారు. ఇదంతా చూసి భీష్ముడు మరి సహించ లేకపోయాడు. అతని కన్ను లెర్రబారాయి. పౌరుషం వెన్ను తన్నింది. లేచి నిల్చుని, తొడ చరిచి సాట్టహాసంగా, సభ కంపించిపోయేలా గర్జించి అతడిలా అన్నాడు. "శిశు

పాలా, నీ తులవతనానికి తోడు, మిగిలిన వారందరినీ తులువలనే గ్రహించినట్టున్నావు. ఔను. శ్రీకృష్ణుడు పూజార్హుడని నేను చెప్పాను. కాదనగల మగతనముంటే రా. నీ అనుయాయు లెవరో రమ్మను.'' అని అంటూ అతడు తన ధనస్సు తీసి నారి తగిలించి నిల్చున్నాడు. ఈ మాటలు మిగిలిన రాజులలో పౌరుషాన్ని రగుల్కొల్పాయి. వారంతా ఒక్కుమ్మడిగా సభలోనుండి లేచిపోయారు. కను మూసి తెరచేటంతలో సభా మంటపమంతా ఖాళీ అయింది. బయట యుద్ధభేరీలు, శంఖారావాలు, గుర్రాల సకిలింపులు, చక్రధ్వనులు, ఏనుగు ఘీంకారాలు వినిపించాయి. సైనికులు కవచాలు తొడిగారు. ఆయుధాలు తీసేరు. రథాలు కదిలేయి. చతురంగ బలాలు బారులు తీరి మయసభ నాక్రమించి నిల్చేయి.

శిశుపాలుని దూత ఒకడు తిరిగి శ్రీకృష్ణుని వద్దకు వచ్చి 'అయితే యుద్ధానికి రా, లేదా చేసినది తప్పని ఒప్పుకొని క్షమాపణ కోరుకో' అని సందేశం వినిపించాడు. సాత్యకి వానికి బదులు చెప్తూ 'యుద్ధానికి కాదు చావుకి తెగించి మీ రాజును నిలువ' మను అని మారు సందేశం పంపాడు. యజ్ఞ కార్యాలు నిలిచాయి. రణోత్సాహం విజృంభించింది. యాదవ కురు పాంచాల పాండవ బలాలు క్షణంలో యుద్ధానికి సర్వసన్నద్ధమై నిలిచాయి. ఇరు బలాలు రెండు సముద్రాలు తమలో తాము ఢీకొన దలచి నిలిచినట్లు

రణరంగంలో అన్యోన్యాభిముఖంగా నిలిచాయి. పట్టరాని పౌరుషోత్సాహాలతో పోరు ప్రారంభమయింది.

క్షణంలో యజ్ఞ వాటిక యుద్ధరంగంగా మారి ఆజ్య ధారలకి బదులు రక్తధారలతోనూ, హోమాగ్నికి బదులు క్రోధాగ్నితోనూ, వేద మంత్రాలకి బదులు సింహనాదాల తోనూ, సంతోష ప్రలాపాలకి బదులు చావు ఏడ్పులతోనూ నిండిపోయింది. రథికులు రథికులతోటి, మావటీలు మావ టీలతోటి, రౌతులు రౌతులతోటి, పదాతులు పదాతుల తోటి తలపడి ఘోరంగా పోరు సాగించారు. రణభేరుల వాద్య ధ్వనులు, రథాల చక్ర ఘట్టనలు, ఏనుగుల ఘీంకా రాలు, గుర్రాల సకిలింపులు, నాయకుల వీరాలాపాలు, ప్రతివీరుల సింహగర్జనలు అన్నీ కలిసి సముద్రపు హోరును మించి వినిపిస్తున్నాయి. కొందరు బాణాలు వర్షిస్తున్నారు. మరికొందరు కత్తులు ఝళిపిస్తున్నారు. ఇంకొందరు చేతికి దొరికినదే తడవుగా ఎన్నెన్నో ఆయుధాలు విసురుతున్నారు. ఒకడికి కవచం పోయింది. వేరొకడి కాళ్ళు తెగాయి. ఇంకొకడికి చేతులు ఖండించుక పోయాయి. సగం చచ్చి క్రింద కూలేవాళ్ళు కొందరు. చచ్చినవారి నడ్డుకొని చావు తప్పించుకోబోయే వారు కొందరు. చచ్చిపడే ఏనుగుల క్రింద, గుర్రాల క్రింద పడి నలిగి చనిపోయేవారు మరికొందరు. అంతా రక్తపు వరద, మాంసపు ఖని, శవాల గుట్ట. నక్క లకి, గెద్దలకి, కాకులకి పండుగ. విరిగిన గొడుగులు, తెగిన

జండాలు, ముక్కలై పడిన ఆయుధాలు, కూలిన రథాలు, చచ్చిన ఏనుగులు, పడిన గుర్రాలు, ప్రాణాలు పోయినా కత్తులు విడువని భటులు కలిగి ఆ రణరంగం మహా భయంకరంగానూ, అత్యంత భీభత్సంగానూ తయారయింది.

నరకాసురుని కొడుకు బలరామునితో తలపడి మూర్ఛిల్లాడు. శని సాళ్వుని కోడి పారిపోయాడు. ఉల్ముకుడు ద్రుముణ్ణి హతమార్చాడు. పృథువు రుక్మి నోడించాడు. ప్రద్యుమ్నుని చేత చచ్చి సగమై ప్రాణాలు దక్కించుకొన్నాడు బాణుడు. ఉత్తమౌజుడు నిస్తేజుడై కాలికి బుద్ధి చెప్పాడు. ఇదంతా చూసి సంతసిస్తున్నారు దేవతలు. శ్రీకృష్ణుని ఉత్సాహం మరింత హెచ్చింది.

శిశుపాలుడిది కనిపెట్టి తన సేనలను పురికొల్పి తానే స్వయంగా శ్రీకృష్ణునితో తలపడ్డాడు. వెతుకుతూన్న తీగ కాలికి తగిలినట్లు సంతోషించాడు కృష్ణుడు. శిశుపాలునికి సహాయ్యం చెయ్యడానికి సమస్త సేనలు మొత్తపడి శ్రీకృష్ణునిపై విరుచుకపడ్డాయి. ఆ మహాత్ముడు చలించలేదు. చిరునవ్వుతో ధనుస్సుకి నారి సారించి పుంఖానుపుంఖంగా బాణాలు ప్రయోగించాడు. క్షణంలో ఆకాశం బాణాలతో నిండింది. శిశుపాలుడు దీనికి మారుగా బాణ వర్షం కురిపించేడు. కాని కొద్ది సేపటిలోనే అతని సైన్యం పల్చబడింది. అతని కోపం వృద్ధి అయింది. మామూలు యుద్ధం పనికిరాదని మాయ యుద్ధానికి దిగాడు.

శ్రీకృష్ణుని ముందు శిశుపాలుని మాయాబలం మటు మాయ మయింది. అతడు ప్రయోగించిన నాగాస్త్రం గరుత్మంతుని ప్రభావం వల్ల క్షణంలో పటాపంచలయింది. వాని ఆగ్నేయాస్త్రం శ్రీకృష్ణుని వారుణాస్త్రానికి లొంగిపోయింది.

దుఃఖ మాపుకోలేక శిశుపాలుడు తిరిగి శ్రీకృష్ణుని నిందింపసాగేడు. నూరు తిట్లు ఇక్కడికి పూర్తి అయ్యాయి. శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. కోటి సూర్య ప్రభా సమానమైన ఆ దివ్యాయుధం రెప్పపాటులోగా శిశుపాలుని కంఠ ముత్తరించింది. తల వినువీథి కెగిరి పోయింది. మొండెం భూమిమీాద కొరిగింది. అతని శరీరంలోనుండి ఒక దివ్య తేజం వెల్వడి శ్రీకృష్ణునిలో సంక్రమించింది. జయజయ ధ్వానాలతో మిన్ను మారు మ్రోగింది. శత్రుసేన పటాపంచలయి పారిపోయింది. పాండవులు బ్రహ్మానంద భరితులై శ్రీకృష్ణుని స్తోత్రాలు చేసి విజయోత్సాహంతో తిరిగి యజ్ఞ శాలకి మరలారు.

"మహాత్మా, నీదయవలన భూభారకులలో ఒకడైన యీా శిశుపాలుడు పేరు మాసిపోయాడు. దుష్ట శిక్షణ జరిగింది. శిష్ట రక్షణ పాండవుల నుద్ధరించడంతో కనిపిస్తూంది. అవతార పురుషుడవైన నిన్ను ప్రశంసించడానికి మానవులమైన మాకు శక్యమా? మా మా దోషాలు మన్నించవలసిందని తలలొగ్గి నమస్కరించడమే మా కలవియైన పని." అని అంటూ భీష్ముడు శ్రీకృష్ణునికి నమస్కరించాడు.

తక్కిన రాజలోకమంతా అతణ్ణి అనుసరించింది. యజ్ఞం నిర్విఘ్నంగా కొనసాగింది. ధర్మరాజిచ్చిన కట్నాలు కానుకలు గ్రహించి, చేసిన సత్కారాలకి సంతసించి, మనఃపూర్వకంగా అతని మేలెంచి వచ్చిన రాజులందరూ తమతమ వీటిపట్లకు వెళ్ళిపోయారు. కొన్నాళ్ళ పిదప శ్రీకృష్ణుడు పాండవుల నాశీర్వదించి, ద్వారకకు తిరిగి వచ్చాడు.



# వేణీ సంహారం

రాజసూయ యాగం వలన పాండవులకి వచ్చిన కీర్తి ప్రతిష్ఠలు చూసి కౌరవులు సహించలేకపోయారు. వారి కలిమి వీరికి కన్నుకుట్టు అయింది. ఈ అసహనం వారిని కుతంత్రాలకి ప్రేరేపించింది. సరి, మాయజూద మొకటి కల్పించబడింది. ఆ జూదంలో పాండవులు తమ సమస్త సంపదలు ఓడిపోయారు. తామే ఓడిపోయి ధర్మానికి కట్టుబడి ద్రౌపదికి జరిగిన భంగపాటు సహించారు. పునర్ద్యూతంలో కూడ వీరిని జయలక్ష్మి వరించలేదు. వేసుకొన్న పందెం ప్రకారం జూదంలో ఓడి పాండవులు పన్నెండేళ్లు అడవులలో గడిపి, పదమూడో ఏడు అజ్ఞాతంగా గడిపారు. ఈ మధ్యకాలంలో కూడ కౌరవుల దుర్నయాలు తగ్గలేదు. పాండవుల రాజ్యం తిరిగి వారికివ్వడానికి కాదు, సరిగదా

ఆఖరికి అయిదుగు రన్నదమ్ములకు అయిదు ఊళ్ళు యివ్వ డానికి కూడ దుర్యోధను డంగీకరించ లేదు. శ్రీకృష్ణుడు పోయి చెప్పినా ఫలితం లేకపోయింది. యుద్ధమే శరణ్య మయింది. పాండవ కౌరవ బలాలు రెండూ కురుక్షేత్రంలో యుద్ధానికి ఆయత్తమయి నిల్చాయి. ఈ క్రింది కథ ఆ సందర్భంలోనిది.

* * * * *

"పాండవు లయిదుగురికీ అయిదు ఊళ్ళు చాలు. ఆ మాత్రంతో వాళ్ళు సంతృప్తిపడి సంధికి ఒప్పుకుంటారు." అని ధర్మరాజు శ్రీకృష్ణుని ద్వారా కౌరవులకి వర్తమాన మంపినాడని తెలిసి భీముని కోపం మిన్నుముట్టింది. కౌరవులు తమ కాచరించిన దుర్నయాలెన్ని అతడు మండిపడుతు న్నాడు. దుర్యోధనుని పేరు వింటే చాలు అతని రక్తం ఉడు కెత్తుతూంది. సహదేవు డతనిని శాంతపరుస్తూ యీ కోప ప్రదర్శనం కేవలం ధర్మరాజుకి మనఃక్లేశం కలిగించేదే కాని మరొకటి కాదు కాబట్టి ఎలాగో సహించి ఊరుకోమన్నాడు. కోపంతోపాటు, దుఃఖంకూడ కల్గి, వళ్ళు మండి భీముడు వ్యంగ్యంగా ఇలా అన్నాడు. "అవును మహారాజా వారికి దుఃఖం, మనఃక్లేశం కాక మరేమి? ఏమి మాటలంటావు సహదేవా? అన్నగారికి దుఃఖమనేది అసలు తెలుసునా? నిండు సభలో ద్రౌపదికి అవమానం జరుగుతూంటే చూడ గలిగారు. విరాటనగరంలో కీచకునిచే పరాభవించబడి నప్పుడు కూడ చూసి ఊరుకో గలిగారు. అతనికి దుఃఖమా?

మనమీాద కోపం. కౌరవులమీాద ప్రేమ. ఛీ, ఇకముందు నేనాతని మాట వినదలచుకోలేదు. నా యీా గద కౌరవుల రక్తంతో తడిసిగాని శాంతించదు. నీవు కావాలంటే పోయి ఆయనతో నామీాద ఫిర్యాదు చెయ్యి." అని అంటూ అతడు అస్త్రాగారంవేపు చరచరా నడువసాగేడు. కాని కోపావేశంలో ఉన్నందువల్ల అస్త్రాగారానికని బయల్దేరి అంతఃపురానికి వెళ్ళి చేరుకొన్నాడు. వెంటనే వస్తూన్న సహదేవుడిది చూసి "అన్నయ్యా, ఇది ద్రౌపది భవనం" అన్నాడు. "ఆ" అని తిరిగి చూసి, తన తప్పు తాను తెలుసుకొని "అయితేనేం, మరీ మంచిది" అంటూ భీముడు ద్రౌపదిని కలుసుకొనేందుకని ఆ భవనాభ్యంతరానికే త్రోవదీశాడు. సహదేవుడు కూడ వెనువెంటనే లోనికి వెళ్ళి "కృష్ణా గమనాన్ని ప్రతీక్షిస్తూ, ఇక్కడ యీా కృష్ణాజనం మీాద కొంతసేపు విశ్రమించకూడదూ" అన్నాడు. ముందు వెనుకలు చూడకుండా ముక్కుకు సూటిగా పోతూన్న భీమునితో, 'కృష్ణ' అనేమాట వినగానే భీమునికి సంధి రాయబారాలు స్ఫురణకు వచ్చి వళ్ళంతా తేళ్ళూ జెర్రులు ప్రాకినట్టయింది. తిరిగి ధర్మరాజుని, ఆయన శాంత స్వభావాన్ని దుయ్యబట్ట నారంభించేడు. ఇంతలో కంట తడి ఒత్తుకుంటూ ద్రౌపది వారున్న చోటికి వచ్చింది. కాని భీముడామె రాకను గమనించనేలేదు. తన ధోరణిలో తానే మాటాడుతూ "కానీ, మహారాజుగారు సంధికి ఒప్పుకుంటే

ఏమయింది? నేను కౌరవులను చంపకుండా నిద్రపోతానా? దుర్యోధనుడి తొడలు విరుగగొట్టనిదే నా పేరు భీముడా? దుశ్శాసనుడి నెత్తురు త్రాగనిదే నా మనస్సు శాంతిస్తుందా?"

అతణ్ణి సముదాయిస్తూ, సంధి తాత్పర్యాలు చక్కగా వివరించబోయాడు సహదేవుడు. కాని అతడు వింటేనా? "ఊరుకోవోయ్, చాలు. శత్రు నాశనానికి మీరంతా ఒప్పుకోలేరుగాని, ద్రౌపదికి భంగపాటు జరుగుతూ ఉంటే ఒప్పుకో గలుగుతారు." అని మండలించాడు భీముడు.

ఈ మాటలు ద్రౌపది కెంతైనా ఆనందం కలిగించాయి. కాని భీముడింకా ఆమె రాకని గమనించనే లేదు. చివరకి సహదేవుడు సంజ్ఞచేసి చూపిస్తే అప్పుడామెను గుర్తించినట్టుగా తెములుకొని "క్షమించు దేవీ, నిన్ను చూడనే లేదు" అన్నాడామెతో. ఆమెను సగౌరవంగా తన వద్ద కూర్చోబెట్టుకొని, ఆమె కంట తడి చూసి, మళ్ళా క్రోధమూర్తియై, కారణ మేమిటని ప్రశ్నించాడు. అందుకు బదులుగా దగ్గరఉన్న దాసీది ఇలా చెప్పింది. "స్వామీ, యీ రోజు దేవిగారు కుంతీదేవిగారి బసకు వెళ్ళి వస్తూ ఉండగా, దగ్గరగా ఉన్న గాంధారి బసకు కూడ వెళ్ళవలసి వచ్చింది. ఆమెకు నమస్కరించి రాబోయేటంతలో అక్కడకు వచ్చిన భానుమతి, దేవిగారికి వినిపించేలా, వ్యంగ్యంగా, 'అయిదూళ్లు పుచ్చుకొని సంధి చేసుకొంటా మన్నారుగదా

పాండవులు, ఇంకా ద్రౌపది తన జుట్టు ముడి వేసుకో లేదేమి?' అని పలికింది. దేవిగారూరుకొన్నారు. కాని స్వామీ, నాకు వళ్ళు మండింది. 'భానుమతిగారి జుట్టుముడి వీడితే, మా దేవిగారి జుట్టు ముడిపడుతుంది' అని గట్టిగానే అనేశాను."

దాసీ పలుకులు భీమునికి అమృతోపమానాలుగా విని పించాయి. కడుపులో ఉన్న ఉడుకు సగం తగ్గినట్టయింది. సంతోషం పట్టలేక అతడు తన చేతి కంకణాలు రెండూ ఆమెకు బహుమతీ యిచ్చేడు. పిదప ద్రౌపది నాశ్వాసిస్తూ "దేవీ, నీవు చింతించకు. అనతి కాలంలోనే దుర్యోధనుని తొడలు విరిచి, ఆ రక్తంతో నీ జుట్టు చిక్కుదీసి ముడి వేస్తాను." అన్నాడు. ద్రౌపది నమ్మీ నమ్మనట్టుగా నిట్టూ రుస్తూ "మీరెంతైనా చేయ సమర్థులే. కాని మీ అన్నగా రంగీకరించిన నాడుగదా!" అని పలికింది.

ఇంతలో బయట శంఖారావం వినవచ్చింది. మరు క్షణంలో ఓ దాసీది వచ్చి శ్రీకృష్ణుడు సంధి రాయబా రాలు విఫలమై తిరిగి వచ్చాడని, ఆ దుర్మార్గులైన కౌరవు లాతణ్ణి బంధించడానికి కూడా ప్రయత్నాలు చేశారట అనిన్నీ తెలియజేసింది. ఈ వార్త భీమునికి పండుగలా తోచింది. ఇక యుద్ధం తప్పదనే సంతోషంతో ఆయన ముఖం వికసించింది.

కొద్ది రోజులలో పాండవ సేన యుద్ధానికి బయల్దే రింది. విందు భోజనానికి వెళ్ళినంత ఉత్సాహంతో భీముడు

రణరంగానికి బయల్దేరాడు. వెళ్ళేముందు ద్రౌపది అతనితో ఇలా అన్నది. "ప్రాణేశ్వరా, మీ విజయ మాకాంక్షిస్తాను. మీ రయిదుగురు అన్నదమ్ములు విజయ గర్వంతో సకుశలంగా తిరిగి రావలసినదని దేవతలను ప్రార్థిస్తున్నాను. కాని మీతో ముఖ్యంగా ఒక మాట. కోపావేశంలో మిమ్ము మీరే మరచి శత్రువుల కపటానికి లొంగిపోవద్దని మనవి." భీమసేనుడు నవ్వుతూ "నీకా విచారం కలుగ నివ్వనులే" అని అంటూ వెళ్లిపోయేడు.

యుద్ధం ప్రారంభమయింది. పది రోజులు పోరి భీష్ముడు శరతల్పగతుడయ్యాడు. ద్రోణుడు కౌరవ సేనకి అధ్యక్షుడుగా వరింపబడ్డాడు. అతడు పన్నిన పద్మవ్యూహంలో అభిమన్యుడు ప్రవేశించాడు. తోడు పడటానికని పోయిన భీమసేనాదు లందరినీ సైంధవుడొక్కడే అడ్డగించి ఓడించాడు. అర్జునుడు దూరంగా ఎక్కడో యుద్ధం చేస్తున్నాడు. అభిమన్యుడు చివరకి నిస్సహాయుడై, కౌరవుల అన్యాయ యుద్ధానికి బలి అయిపోయాడు. ఈ విషయం కౌరవ సేనలో మహోత్సాహానికి హేతువైంది. పట్టరాని సంతోషంతో దుర్యోధనుడు తన భార్య భానుమతి యింటికి పయనమయ్యాడు. ముందుగా కంచుకి ద్వారా ఆమెకు కబురు పెట్టాడు. దుర్యోధనుడు పోయి చేరుకొనే సమయానికామె సఖీజన పరివృతయై ఏదో దుఃస్వప్నం గురించి చింతిస్తూంది. దుర్యోధనుడు వారి మాటలు పొంచి విన్నాడు.

ఏదో ఒక ముంగిస వచ్చి నూరు పాముల్ని కొరికి చంపినట్లూ, పిమ్మట లతా మండపంలో విహరిస్తూన్న తనమీదికి వచ్చి కొంగు కొరికి లాగినట్లూ భానుమతి కలగన్నది. ఇది విని దుర్యోధనుడికి మతిపోయినట్లయింది. "ఇంతలో మంగళ వాద్యాల చప్పుడు విని మేల్కొన్నాను" అని చెప్పిన భానుమతి మాటలు విని తిరిగి తన్ను తానే సముదాయించు కొన్నాడు.

ఈ స్వప్నం మంచిది కాదనిన్నీ, తగిన శాంతి చేయిం చుకోవాలనిన్నీ దాసీలు చెప్పారు. తర్వాత భానుమతి సూర్యోపాసన కుపక్రమించింది. దుర్యోధనుడిదే తగిన సమ యమని ఎంచి ఆమెకు వెనుకతట్టుగా బోయి, చేసంజ్ఞలతో దాసీలను వారించి, పూజాద్రవ్యాలు తీసుకొని ఆమె ప్రక్కనే వెళ్ళి నిల్చున్నాడు. భానుమతి కళ్ళు మూసుకొ ధ్యానిస్తూంది. పూజా ద్రవ్యాలకోసం చేయి చాచేసరికి ఆమె చేతికి దుర్యోధనుని చేయి తగిలింది. చేతిలో ఉన్న పుష్పాలు క్రింద రాలేయి. ఇది అపశకునంగా భావించి 'అంత ప్రమత్తత ఏ' మంటూ ఆమె దాసీని నిందించబోయి కనువిప్పి చూస్తే దుర్యోధనుడు సాక్షాత్కరించాడు. "ఇలాటి సేవలో నేను ప్రమత్తుణ్ణే కదూ" అన్నాడు నవ్వుతూ. భాను మతి తత్తరపడి "క్షమించండి, యీ వ్రతం మీ మేలు కోసమే" అని ఇంకా ఏమో చెప్పబోయింది. "నేను నీ కల సంగతి విన్నాను. దేవీ! కాని దుర్యోధనుడు వంటి

వాని రాణివై నీవు కలలు నిజమని భ్రమించి భయపడడం మాత్రం బాగులేదు" అన్నాడు దుర్యోధనుడు.

ఇలా ఆ దంపతులు మాటాడుకొంటూన్న సమయం లోనే ఉన్నట్టుండి ఓ గాలి దుమారం లేచింది. చూజూస్తూ ఉండగానే ఆకాశం ధూళి మేఘాలతో నిండిపోయింది. దిక్కులు చీకట్లు కమ్మాయి. భానుమతి బెదిరి బెగ్గడిల్లింది. దుర్యోధనుడామె నెట్లో లోనికి తీసుకొనిపోయాడు. ఇంతలో ఓ దూత గాభరాగా పరుగెత్తివచ్చి యీ విసిరిన భీమ పవనపు తాకిడికి దుర్యోధనుని రథ ధ్వజం కూలిందని చెప్పాడు. కాని దానికత నంతగా విచారించలేదు. మరు క్షణంలోనే సైంధవుని తల్లి, తన చెల్లెలు దుస్సల ఏడుస్తూ పరుగెత్తి వస్తే చూసి గాభరాపడ్డాడు. "జయద్రథుడు కుశలమా?" అని తడబడుతూ అడిగాడు. "ఇంకేమి కుశలం? ఈరోజు సూర్యాస్తమయ మయ్యేలోపున సైంధవుని తల ఖండిస్తానని సవ్యసాచి ప్రతిజ్ఞ పట్టాడు" అని ఏడుస్తూ చెప్పింది సైంధవుని తల్లి. "ఓస్ ఇంతేనా" అని తన్ను తాను సముదాయించుకొని, వారిని సాంత్వన పరుస్తూ దుర్యోధనుడిలా అన్నాడు. "మరేమీ భయంలేదు. మీరు దుఃఖించకండి. నా రక్షణలో ఉన్న సైంధవుని సంహరించడానికి అర్జునునికి కాదు, పాలాక్షునికైనా శక్యం కాదు. ఈ అర్జునుని శౌర్యం మన మెరుగనిదా? అంత శక్తి సామర్థ్యాలుంటే ద్రౌపదీ వస్త్రాపహరణం నాడే అది చూపి ఉందును." అన్నాడు

డాంబికంగా, "ఈ నిస్సారాలానికేమిగాని, తన ప్రతిజ్ఞ నెర వేరకపోతే తానే అగ్నిలో పడి మరణిస్తానని కూడ ప్రతిన పట్టాడట అర్జునుడు" అన్నది దుస్సల. "అయితే మరీ మంచిది" అన్నాడు దుర్యోధనుడు. "మనకి చక్కని అవ కాశం కుదిరింది. ఈ దెబ్బతో పాండవులంతా నశించా రనుకో చెల్లీ. ఇదే నేను పోయి అందుకు తగిన ప్రయత్న మంతా చెస్తాను. నీవేమీ భయపడకు" అని చెప్పి వారి నాశ్వాసించి దుర్యోధనుడు రణభూమికి వెళ్ళిపోయాడు.

అభిమన్యుని చంపినారనే కోపంతో ద్విగుణీకృతా వేశులై యుద్ధం చేస్తున్నారు పాండవులు. కౌరవుల ప్రయ త్నమంతా భగ్నంచేసి సూర్యాస్తమయాత్పూర్వమే సైంధ వుని తల పాశుపతాస్త్రంతో ఎగురవేసేడు పార్థుడు. అతణ్ణి కాపాడ వచ్చిన వీరులెందరో అర్జునుని బాణాగ్నికి ఆహుతు లయ్యారు. ఇదంతా చూసి ద్రోణుడు ఆ రాత్రి నిర్విరా మంగా యుద్ధం కొనసాగనిచ్చేడు. తండ్రిగారి యీ పంతం చూసి అశ్వత్థామకే ఆశ్చర్యం వేసింది. కాని వచ్చి చూడ బోతే కౌరవసేనలు పారిపోతున్నాయి. హఠాత్తుగా అతని కెడమ కన్ను అదిరింది. ఇంతలో ఎవరో వెనుకనుండి 'మీ నాన్నగారీ రోజుతో సరి' అంటూన్నట్టు వినిపించింది. పట్టరాని కోపంతో "ఎవడా అంటున్న దుర్మార్గుడు! మా నాన్నగారి కేమైనా ఆపదవస్తే యీపాటికి సూర్య బింబం నేల రాలవలసింది. ఏదీ అటువంటి ఉత్పాతా లేవీ

కనబడవే" అని మారు పల్కేడు తిరిగి చూస్తూను. 'హతోఽస్మి, రక్ష, రక్ష' అంటూ పరుగెత్తుకొని వస్తూన్న ద్రోణ సారథి ఆయన కంటికి కనిపించాడు. "అయ్యమ్మంతా, మీ తండ్రిగారు గతించారు. ఇక నీవే మాకు రక్ష" అంటూ అరచివచ్చి పాదాలవద్ద నిల్చాడా సారథి. అశ్వత్థామ కీవార్త వినగానే మూర్ఛ కలిగింది. కొంత సేపటికి తెప్ప రిల్లి తక్కిన సంగతులన్నీ అడిగి తెలుసుకొన్నాడు. వీరా వేశంతో యుద్ధం చేస్తూన్న ద్రోణుని ధాటి కాగలేక పాండ వులేదో కుతంత్రం పన్నినారనీ, దాని ననుసరించి ధర్మరాజు ద్రోణునికి వినిపించేలా 'అశ్వత్థామ గతించినట్లే' అని గట్టిగా అరచి 'ఏనుగై తేనేం' అని వినపడకుండా మెల్లగా పలికినా డనీ, ధర్మజుడాడి తప్పనివాడనే నమ్మికచేత ద్రోణు డశ్వ త్థామ గతించినాడనే కల్లవార్త సత్యంగా గ్రహించి పుత్రి శోకంతో ప్రాయోపవేశం చేసి ధనుర్బాణాలు త్యజించి నాడనీ, ఆ అదునుచూసి ధృష్టద్యుమ్ను డాతని కంఠ ముత్త రించేడనీ సారథి పూసగుచ్చినట్లు చెప్పాడు. అన్నీ విన్న తర్వాత అశ్వత్థామకు మరోసారి దుఃఖావేశంతో మూర్ఛ కలిగింది. ఈసారి తెలివి వచ్చేసరికి ప్రక్కనే నిల్చొని ధైర్య వచనాలు చెప్పుతూ ఓదారుస్తూన్న కృపాచార్యుడు కని పించాడు. కాని అశ్వత్థామ కోపం హద్దుపద్దులు దాటి పోతూంది. పరశురామునివంటి చండ ప్రతిజ్ఞ ఒకటి పట్ట బోయి "పాండవుల రక్తంతోగాని నేను పితృ తర్పణాలు

చెయ్యి" నన్నాడు. అతణ్ణి సముదాయించి శాంతపరుస్తూ కృపాచార్యుడిలా అన్నాడు. "అబ్బాయి, నీవెంతకైనా సమర్థుడవు. కాని ఇప్పుడు సమయం పట్టు పంతాలకి కాదు. ముందు నీకు సేనాధిపత్య పదవి రావలసిఉంది. మూడు వంతులు ఈపాటికే నీ పరోక్షంలో రాజరాజా నిర్ణయం చేసి ఉండవచ్చు. అక్కడికి వెళదాం. రా" అని అంటూ అతణ్ణి తన రథంమీద కూర్చోబెట్టుకొని దుర్యోధనుని శిబిరానికి త్రోవదీసేడు కృపాచార్యుడు.

వీరు వెళ్లేసరికి గుడారంలో కర్ణ దుర్యోధను లేకాంతంగా యుద్ధస్థితిని గురించి చర్చిస్తున్నారు. "మిత్రమా, ఈరోజు గురువుగారు చేసినపని నాకేమీ సమంజసంగా తోచలేదు. కొడుకు చావు వినగానే అతడు ధనుర్బాణాలు విడిచి మనల్ని దగా చేసేడు" అన్నాడు దుర్యోధనుడు. "నేను మొదటే చెప్పాను" అన్నాడు కర్ణుడు. "ఆచార్యుని మనస్సు అబ్బాయికి కిరీటం తొడగడానికిగాని కౌరవ రాజైన దుర్యోధనునికి కాదు. అందుకే అతడు జయద్రథుడు చనిపోతూఉంటే చూస్తూ ఊరుకో గలిగేడు. ఈయన గారి కుచ్ఛిత మెరిగినవాడు గనుకనే ద్రుపదుడితణ్ణి ఊరిలో నుంచి వెళ్ళగొట్టాడు" అన్నాడు కర్ణుడు.

ఇంతలో కృపాచార్యాశ్వత్థామ లక్కడికి చేరుకొన్నారు. వీరిని చూసి దుర్యోధనుడు ప్రసంగం మార్చి, ద్రోణుని మరణం గురించి తన సంతాపం వెల్లడించి, అశ్వ

త్థామతో కొంత సానుభూతీ, కొంత సమవేదనా ప్రకటిం చాడు. అశ్వత్థామ దానికి బదులు చెప్తూ, "చావు కేం. ఎప్పు డేనా జరగవలసిందే. కాని నేను జీవించి ఉండగా మా తండ్రి గారికిట్టి అవమానం జరిగినందుకు నేను చాలా పరితపించి సిగ్గుపడుతున్నాను" అన్నాడు.

"ఆయన స్వయంగా ధనుర్బాణాలు వదిలి చావు నాహ్వానిస్తే ఇంకొకరి దోషమేముంది? అశ్వత్థామా!" అన్నాడు కర్ణుడు. "ఎవరి దోషమో, ఎవరేమి చేయగలుగు తారో చూదాం" అంటూ వీరావేశంతో అశ్వత్థామ కర్ణునికి బదులు చెప్తూ ఇంకా ఇలా అన్నాడు. "పాండవ పాంచాల బలాల రక్తంతో పితృ తర్పణాలు నిర్వహిస్తానని నా ప్రతిజ్ఞ."

ఈ మాటలలో గల ఔచిత్యాన్ని ప్రశంసిస్తూ కృపా చార్యుడు కౌరవ సేనకీ అశ్వత్థామనే ఇక అధిపతిగా నిర్ణ యించవలసినదని దుర్యోధనునికి సలహా ఇచ్చాడు. దుర్యో ధనుడా మాటలో గల యుక్తాయుక్తతలు విచారించకుం డానే, "నిజమే. ఆయనందుకు తగినవాడే, కాని నేనా పద వికి కర్ణుని నియోగించానప్పుడే" అని విచారం నటిస్తూ జవాబు చెప్పాడు. అసలే దుఃఖంలో ఉన్న కృపాచార్యా శ్వత్థామల కిది విన్న తర్వాత మరింత అవమాన మనిపిం చింది. చివరికి పంతాలు, పట్టుదలలు, వ్యక్తి దూషణలు కూడ జరిగేయి. అశ్వత్థామ కర్ణుని సూతపుత్రుడని ఈసడిం

చాడు. అతడది విని భగ్గున మండిపడి, "మీ తండ్రిగారు పౌరుషం విడిచి, ఆడుదానిలా నీకోసం ఏడుస్తూ, శత్రువు వచ్చి జుట్టు పట్టుకొని ఈడుస్తూన్నప్పటికీ కిమ్మనలేదు. ఆ శౌర్యమే ఎక్కువో, నా సూతపుత్ర శౌర్యమే ఎక్కువో యీరోజునుండి చూదువుగానిలే" అన్నాడు అశ్వత్థామతో. "పెద్ద కబుర్లు చెప్పకు. శౌర్యముంటే రా. నన్నెదుర్కో" అని అంటూ అశ్వత్థామ కర్ణుని మీదికి కత్తి దూసేడు. దుర్యోధన కృపాచార్యులిద్దరూ తత్తరపడి వారిద్దరినీ వారించి నిలిపేరు. "బ్రాహ్మడివని ఊరుకొన్నాను, కాని లేకపోతే నీకంఠ మీపాటికె కెప్పుడో ఉత్తరించిఉందును" అన్నాడు కర్ణుడు. "నీకా అనుమానమెందుకు రా" అంటూ జందెం తెంపి, కత్తి పట్టుకొని నిలిచేడు అశ్వత్థామ. తిరిగి వాని నా పేసరికి దుర్యోధనుని కిటు, కృపాచార్యుని కటు తలప్రాణం తోకకివచ్చినంతయింది. అశ్వత్థామకి కోపం పట్టరాలేదు. "ఈ సూతపుత్రుడు సేనాధిపతిగా ఉన్నంతవరకు నేనీ యుద్ధంలో పాల్గోలేను." అని అంటూ కత్తిని నేలమీద విసరిపారేశాడు. "అది మీ యింటి ఆచారమేగా! కత్తి వదిలేసి మరేం ఘన కార్యం చెయ్యలేదులే! అన్నాడు వ్యంగ్యంగా కర్ణుడు.

ఇంతలో బయటనుండి ప్రళయ మేఘ గంభీరమైన గర్జారవం వినిపించింది. "ఒరేయి, పాపాత్ముడా, ఇన్నాళ్ళకి నీ పాపాలు బ్రిద్దలయాయి రా, దుర్మార్గుడా, రా. ఇక నెవరు నిన్ను కాపాడుతారో పిలువు. ఈరోజుతో

నీ ఆయుస్సు సరి. నా ప్రతిజ్ఞ చెల్లించి నీగుండె చీల్చి రక్తం త్రాగుతాను చూడు. ద్రౌపదిని చీర పట్టుకొని లాగినట్టు కాదు. ఇది భీమునితో పోరాటం. ''

ఆ మాటలు వినగానే అశ్వత్థామ కర్ణుని ఉలికిస్తూ ''అయ్యా, సూతపుత్రుడుగారూ, ఇదుగో మీ శౌర్య సాహసాలు ప్రదర్శించడానికి అనువైన సమయం వచ్చింది. చేతనైతే వెళ్ళి దుశ్శాసనుని బ్రతికించండి'' అన్నాడు. ''నా కంఠంలో ప్రాణముండగా ఆపని ఎన్నడూ జరుగదు'' అంటూ కర్ణుడాత్రంగా బయటికి నడిచాడు. దుర్యోధనుడు కూడ అతనితోపాటు తత్తరపడి పరుగెత్తాడు కాని బయట కోలాహలం ఇంకా ఎక్కువయింది. దుశ్శాసనుడు మరణించేడని అశ్వత్థామకి రూఢి అయింది. తన పంతానికి తానే విచారిస్తూ అతడు తన శిబిరానికి త్రోవదీసేడు. కృపాచార్యుడు రణరంగం వైపు నడిచాడు.

అక్కడ దుశ్శాసనుణ్ణి రక్షించబోయి దుర్యోధనుడు చావు దెబ్బలు తిని మూర్ఛపోయాడు. సారథి అతని రథాన్ని యుద్ధభూమినుండి ఓసరించి ఒక సురక్షిత స్థానంలో నిల్పాడు. సేన ఘోరంగా పోరు సాగిస్తూంది. కృపాచార్యుడు సేనలను పురికొల్పుతూ బాణ వర్షం కురిపిస్తున్నాడు. ఆ ప్రక్కనుండి దుశ్శాసనుని నెత్తురు త్రాగి మత్తెక్కి సింహనాదం చేస్తున్నాడు భీముడు. కొంత సేపటికి తెప్పరిల్లి తెలివి తెచ్చుకొన్నాడు దుర్యోధనుడు. '' అరే భీముడెక్కడ ''

అంటూ సారథిని గర్జించాడు. రథాన్ని దుశ్శాసనుడున్న చోటికి తోలమన్నాడు. కాని అంతా సరి అయిపోయిందన్న వార్త వినే సరికి పిడుగుపడి కూలిన వృక్షంలా మరొకసారి పెనుమూర్ఛకి లోనయాడు. తెలివి వచ్చిన పిదప ఎంతో సేపు తమ్మునికోసం విపరీతంగా విలపించాడు. ఇది ఇలా ఉండగా గోరుచుట్టుమీద రోకటి పోటన్నట్లు, ఒక సైనికుడు వచ్చి, కర్ణుని కొడుకు వృషసేనుడు అర్జునునితో పోరి గతించాడని చెప్పాడు. ఈ వార్త దుర్యోధనుణ్ణి మరోసారి మూర్ఛలో ముంచింది. తిరిగి తెలివి వచ్చిన పిదప ఆ సైనికుడతనితో ఇలా చెప్పాడు.

"పుత్రి మరణ శోకావేశం కోపంగా మారి కర్ణుడు యుద్ధం చేస్తున్నాడు. తన రక్తంతో యీ లేఖ వ్రాసి మీకిమ్మని పంపేడు" అని చెప్పి ఆ సైనికుడో లేఖ దుర్యోధనుని కిచ్చాడు. అందులో ఇలా వ్రాసిఉంది. "స్వస్తి. శ్రీ దుర్యోధన మహారాజులుంగారిని గారాబంగా కౌగలించుకొని మిత్రుడు కర్ణుడు వ్రాసి పంపిన లేఖాంశములు ఏమనగా, తాము చెప్తూవచ్చినప్రకారం నాకు యుద్ధమంటే-ప్రియబంధు మిత్రులకంటె ప్రీతిదాయకమైనది. పాండవులను మనము విధిగా జయిస్తాము. కాని దుశ్శాసనుని చంపి అతని రక్తం త్రాగుతూన్న భీమసేనుని నేనీరోజు నివారించలేక పోయినందుకు మిక్కిలి చింతిస్తున్నాను. ఇది నా అసమర్థతకి ప్రమాణంగా భావించి, తామిక నామీద ఆశలన్నీ వదులుకొని, స్వభుజాశక్తిమీద

ఆధారపడి యుద్ధం చెయ్యడంగాని, లేదా రహస్యంగా యింటికి మరలడంగాని చెయ్యవలసినదని నా ప్రార్థన.''

ఈ ఉత్తరం చదువుకొని దుర్యోధనుడు మరింత దుఃఖించాడు. అయినా మానవంతుడు గనుక లేని ధైర్యం తెచ్చుకొని కర్ణుడికీవిధంగా కబురు పంపాడు. "మన మనస్సులు, మన సంకల్పాలు ఎప్పుడూ ఒకటే. పాండవులపై పగ సాధించవలసినదే. ఆమీద బంధువులకోసం విచారిద్దాం. మా తమ్ముడు చనిపోయాడు. నీకు పుత్రశోకం కలిగింది. ఎవర్నెవరు సముదాయించాలి? యుద్ధంలో చావో రేవో తేల్చుకోవడమే మనకి తరుణోపాయం.'' అని చెప్పి పంపి తాను తిరిగి యుద్ధభూమికి పయనించాడు దుర్యోధనుడు. కాని ఇంతలో గాంధారీ ధృతరాష్ట్రులు వస్తున్నారని వర్తమానం వచ్చింది. దుర్యోధనునికి చెప్పరానంతగా గ్లాని కలిగింది. పారిపోయి ఎక్కడైనా దాగొందా మనుకొన్నాడు. ''ఉదయం దుశ్శాసన సహితంగా పోయి తల్లిదండ్రులకి నమస్కరించాను. ఇప్పుడొక్కణ్ణే పోయి వారికి నాయీ పాపిష్ఠి ముఖం ఎలా చూపగలను'' అని విలపించాడు. సారధి అతణ్ణి ఏదో చెప్పి ఓదార్చసాగేడు. కొంత సేపటికి గాంధారీ ధృతరాష్ట్రులతనిని సమీపించారు. సంజయుడు కూడ వారితోనే ఉన్నాడు. గత్యంతరం లేనివానివలె, ముఖం వాల్చి కంట తడిబెట్టుకొని దుర్యోధనుడు తల్లి దండ్రులను సమీపించాడు. అతని నమస్కారమందుకొని వారత

నిని కౌగలించుకొన్నారు. "నాయనా, మాటాడవేమి? ఎక్కువగా గాయాలు తగిలాయా తండ్రీ! నీవు మాటాడకపోతే నీ పెద్దతమ్ముడిక వచ్చి మాటాడతాడా?" అంటూ విలవిల విలపించింది గాంధారి. "అమ్మా నా ప్రయత్నాలు, నా ఆశలు అన్నీ భగ్నమయాయి. నావల్ల కులానికే కళంకం వచ్చింది. ఇక నేమి మాటాడేది?" అశ్రుగాద్గదికమైన స్వరంతో అన్నాడు దుర్యోధనుడు. కొంతసేపీ రీతిగా అన్యోన్యం సముదాయించుకొన్న తర్వాత గాంధారీ ధృతరాష్ట్రులు అతన్ని బుజ్జగిస్తూ "నాయనా, పాండవులతో సంధి చేసుకో. ధర్మరాజు యోగ్యుడు. ఇప్పుడైనా సరే సంధి కొప్పుకుంటాడు" అన్నారు. కాని దుర్యోధనుడందు కంగీకరించలేదు. "శ్రీకృష్ణుడు వచ్చి చెప్పినప్పుడే సంధికి నేను ఒప్పుకోలేదు. ఇప్పుడు నా తమ్ము లొక్కరొక్కరే చనిపోతున్నారు. నాబలం క్షీణించిపోయింది. ఓటమి నిశ్చయమని పిస్తోంది. ఇప్పుడు సంధి చేసుకొని నేనేమి సుఖించాలి! ఇక మిగిలిన దొక్కటే కోరిక. నా తమ్ముడు దుశ్శాసనుణ్ణి చంపిన ఆ భీముని శిరస్సు నా గదతో వెయ్యిముక్కల క్రింద చిదుకగొట్టాలని. అంతే" అని ఊరుకొన్నాడు దుర్యోధనుడు.

ధృతరాష్ట్రుడు కొంచెం మెల్లిగా మాట్లాడుతూ "నాయనా ఆపని కొంత రహస్యంగా చెయ్యకూడదూ" అన్నాడు. మానవంతుడైన దుర్యోధనుడికది కూడ నచ్చలేదు. "మా తమ్ముడు బాహాటంగా ఎదిర్చి చంపబడ్డా" డన్నాడు.

ఇంతలో యుద్ధభూమిలో ఓ పెద్ద కలవరం కలిగింది. ఏమా అని చూసేటంతలో ఒక సైనికుడు పరుగెత్తుకొని వచ్చి 'మహారాజా! అంగరాజు కర్ణుడు అర్జునునితో పోరి వీరగతి పొందా' డని విన్నవించాడు. నరికిన అరటి బోదెలా ఉన్నవా డున్నట్టుగానే కుప్పగూలి మూర్ఛపోయాడు దుర్యోధనుడు. తల్లి దండ్రులు సేవకులు వగైరాలు చేసిన శీతలోపచారాలతో ఎట్టకేలకి ఎలాగో అతనికి తెలివి వచ్చింది. అతడు మరి అక్కడ నిలవలేకపోయాడు. తల్లి దండ్రులవద్ద శెలవు తీసుకొని రణరంగానికి మరలిపోబోయాడు. "నాయనా, పాండవులు మాయావులు. నువ్వు దుశ్శాసనుని పాటికూడ మాయమర్మా లెరుగవు. జాగ్రత్త సుమా" అని హెచ్చరించాడు ధృతరాష్ట్రుడు. "భీమునితోనే నువ్వు కూడా యుద్ధం చేస్తావా, తండ్రీ" అంటూ విలపించింది గాంధారి. "లేదమ్మా, కర్ణుని సంహరించిన ఆ పరమ పాపాత్ములు నరనారాయణులు, వారితో యుద్ధం చేయబోతున్నాను." అన్నాడు దుర్యోధనుడు.

ఇంతలో విజయోత్సాహంతో వీరాలాపాలు చేస్తూ ఆ ప్రక్కనుండి భీమార్జునులు అక్కడికి వచ్చారు. కాని గాంధారీ ధృతరాష్ట్రు లిక్కడఉండటం చూసి అర్జునుడు 'వారికి మన క్లేశం కలిగించకూడదు రాపోదాం' అని భీముణ్ణి మరో ప్రక్కకి మళ్ళించి తీసుకొని పోబోయాడు. కాని భీముడు వింటాడా? అతనికిది చక్కని అవకాశంగా

